**Tehreeke Islami me**
**Khawateen ka Kirdar**
**(Telugu)**

# ఇస్లామీయ ఉద్యమంలో
# మహిళల పాత్ర


మూలం

**డాక్టర్ ఫజలుర్రహ్మాన్ ఫరీది**

అనువాదం

**తస్నీమ్ జహాన్**

# ముందుమాట

ప్రస్తుతం ఇస్లాంను అనుసరించే ముస్లిం అనుచర సమాజంలో ఇస్లామీయ విధానాలను ఉద్దీపనం చేసే మహోన్నతమైన, శ్రేయోదాయకమైన ప్రయత్నంలో ఇస్లామీయ ఉద్యమ వివిధ కోణాలపై మాటామంతీ, ఇంకా చర్చల పరంపర కొనసాగుతోంది. ఇది ఎంతో ఆనందకర విషయం. మానవుడు జీవనం గడపడానికి ఆహారం ఏవిధంగా ఆవశ్యకమో అలాగే జాతుల ఉద్యమాల ఉనికిని మహోన్నతస్థాయికి తీసుకు వెళ్ళడానికి ఇస్లామీయ విధానాల పట్ల అవగాహన, వాటిపై పరిశోధన, ఆలోచనలు కూడా అంతే అవసరం. కాని ఈ కార్యం ఎంత ఆవశ్యకమైనదో, నిర్లక్ష్యం చేయతగనిదో అంతే సున్నితమైనది కూడాను. అందువలన ఒకవైపు ఖుర్‌ఆన్, హదీసుల బోధనలు ఆచరణా యోగ్యమైన కారణాన, మరొక వైపు ముస్లిం సమాజంలో మారుతున్న పరిస్థితులు, వాటి దృక్కోణాలను దృష్టిలో ఉంచుకుని, ఫలితంగా ఎదురయ్యే ఆటంకాలను అధిగమించటం, ఇందులో తలిత్తే ఇబ్బందులను గురించి విచారించటం కూడా నిర్లక్ష్యం చేయలేనివి. ఉమ్మత్ (అనుచర సమాజం)కు చెందిన ఉలెమాయె సాలెహా (ధర్మజ్ఞానులు), సంస్కర్తలు ఈ మహోన్నత కార్యాన్ని ప్రతీ యుగంలోనూ నిర్వర్తిస్తూనే వస్తున్నారు. వీరిలో ఎవరైతే ఉమ్మత్ స్వభావాని

కనుగుణంగా మధ్యేమార్గాన్ని అవలంబించారో వారే సాఫల్యం పొందారు.

20వ శతాబ్దంలో ఇస్లామీయ ఉద్యమాలు కూడా ఇదే మార్గాన్ని అవలంబించాయి. చరిత్ర పట్ల ద్రోహానికి పాల్పడకుండా, గడ్డ కట్టుకుపోయిన మంచు తిన్నెలను పగులగొట్టి, అనుచర సమాజ జీవనానికి ఒక రూపునిచ్చింది. ఇది కేవలం ఒక పరిమిత కాలానికి చెందిన చైతన్యవంత కార్యం కాదు. ఎలాగైతే సముద్రంలో నిరాటంకంగా ప్రవాహంతో మిళితమైన కెరటాలు స్వచ్ఛతతో తీరానికి చేరుకుంటాయో అలాంటి కెరటాల లాంటిది ఈ కార్యం.

ప్రస్తుత పుస్తకం 'ఇస్లామీయ ఉద్యమంలో మహిళలు' ఆలోచింపజేసే, అవగాహన పరిచే ఒక ప్రముఖ ఘట్టం. ఇందులో ఇస్లామీయ ఉద్యమానికి, ఆలోచనాత్మక మార్గదర్శి, విజ్ఞాని అయిన డాక్టర్ ఫజలుర్రహ్మాన్ ఫరీది గారు ఎంతో వివరణాత్మకంగా ఇస్లామీయ ఉద్యమ సంస్థాపనా మహత్కార్యంలో మహిళలు ప్రదర్శించిన అన్వేషణా చురుకుదనాలను విపులీకరించారు. వీరి ఈ పుస్తకం ముస్లిం మహిళలందరినీ ఇస్లామీయ ఉద్యమంతో సత్సంబంధమేర్పర్చడానికి, ఇస్లాం ధర్మానికి ప్రాబల్యత, దృఢత్వం కలిగించే విషయంలో వారిని తీర్చిదిద్దే ఉజ్వలమైన అస్త్రం కాగలదని ఆశిస్తున్నాం.

- ప్రకాశకులు

## ఇస్లామీయ ఉద్యమంలో మహిళల పాత్ర

ముస్లిం మహిళల సర్వసాధారణ ఆచరణలతో ముస్లిం సమాజ సంస్కరణ, ఇస్లామీయ ఉద్యమ సందేశ ప్రచారపు ఒక పెద్ద ఛాలెంజ్ ముడిపడి ఉంది. ఇస్లామీయ వ్యవస్థలో మహిళల హక్కులు, వారి సామాజిక పాత్రను పాశ్చాత్యులు తమ దాడులకు ప్రధాన లక్ష్యాలుగా చేసుకున్నారు. దాడికి గురవుతున్న ఈ అంశాలపై ఏమరుపాటు, బుద్ధిహీనత్వాలను కనబరచడం వల్ల ఎన్నో ఊహించనలవి కాని పరిణామాలు దాపురించగలవు.

## ఉలెమాలు, ఇస్లామీయ ఉద్యమం - మహిళలు

ముస్లిం మహిళలకు సంబంధించిన చర్చనీయాంశాలను, ఇస్లామీయ ఉద్యమాలు, ఉలమాల పట్ల నిరాసక్తత వెలిబుచ్చడమో, చూపోపు వహించడమో చేయకుండా షరీఅత్‌కు అనుగుణంగా తమ శక్తానుసారం, మొక్కవోని ధైర్యసాహసాలతో ముస్లిం సమాజం ముందు బహిర్గత పరచవలసిన అవసరం ఉంది. ఇలా వీటిని బహిర్గతం చేయడం వల్ల ఇస్లామీయ ఆలోచనా విధానాలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. ముస్లిం సమాజంలో న్యాయం, మధ్యేమార్గం విస్తరిస్తుంది. ఇంకా వీటిని

అణగదొక్కటానికి, రూపుమాపడానికి ఊతమిచ్చే పునాదులు నేలమట్ట మవుతాయి. దీని ఆధారంగా రూపుదిద్దుకున్న సమాజంలో కాంతిని అడ్డు కున్న చీకటి పటాపంచలవ్వాలి. ఈ పనిని నిర్వర్తించడానికి విజ్ఞానాత్మ కంగా, విచక్షణాయుతంగా అలుపెరగక ప్రయత్నించడం ఎంతో ఆవశ్యక మైనది. అజ్ఞానం, నిర్లక్ష్యాలను అడ్డుకునేందుకు కేవలం ఉల్లేఖనాల జ్ఞానం, మిడిమిడి జ్ఞానం కలిగి ఉండటం సరిపోదు. దీనిని నిరూపించటం అన్నదానికి అర్థం ముందుకు సాగాలన్న సంకల్పం కలిగి వుండటం. ప్రస్తుత కాలానికి చెందిన ఆధునిక టెక్నాలజీల ముందు ఇవి నిలువలేవు. ప్రధానంగా ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, ఇది ఇంటర్‌నెట్, ఇ-మెయిల్, ఇంకా తదితర మార్గాల ద్వారా దేశాల మధ్యనున్న సరిహద్దులను పూర్తిగా తుడిచి వేసింది. ఇప్పుడు అన్నిరకాల నిరుపయోగమై మాటలు ఇన్ఫర్మేషన్ పేరుతో ప్రపంచమంతటా వ్యాపించాయి. వీటి ద్వారా నిషిద్ధమైన, జుగుప్సాకరమైన, అశ్లీలమైన, అరాచకానికి దారితీసే విషయాలన్నీ కంప్యూటర్లలో బటన్ నొక్కగానే లభిస్తున్నాయి. వీటిని ఏ దేశమూ నిరోధించలేకపోతోంది. వీటిని ఎదుర్కొనే శక్తి కేవలం శక్తిమంతంగా నిలిచే, ధీటుగా సమాధానమివ్వగలిగే ఎదురుదాడికే ఉందనడంలో సందేహం లేదు. ఈ కారణాన ధైర్యసాహ సాలతో, సమాధానాల అంబులతో ముందడుగువేయడం ఎంతైనా ఆవశ్యకం.

## నిర్ధారణ, విశదీకరణ

ఇస్లామీయ పాలనా వ్యవస్థ ఆలోచనలు, ఆచరణలు, నియమాలు, నిర్ధారణకు ఆధారభూతాలు. వీటికి విస్తారమైన, సాహసవంతమైన విశదీకరణ, నిగూఢార్థాలు తెలియపరచాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఈ నిర్ధారణలో మిల్లతె ఇస్లామియా తన సామూహిక జీవన అలుపెరుగని ప్రయాణంలో ఒక ప్రముఖమైన భాగంగా చేసుకున్న ఈ చారిత్రాత్మక సాంప్రదాయాలు, ఇంకా ఇందులోని సంస్థల నిర్ధారణ జరగకున్నప్పటికీ ఖుర్‌ఆన్ మజీద్ శాశ్వత బోధనలు, దైవప్రవక్త (స) వారి సున్నత్‌లు ఈ కఠోర ప్రయత్నానికి ఎల్లలు. కాబట్టి మనం వీటి వైపునకే మరలి నిర్ణయిద్దాం. మన లక్ష్యాలు, అభీష్టాలు, ఆచార వ్యవహారాలు, సభ్యతా సంస్కారాలన్నింటినీ ప్రక్షాళించి వాటిని నిర్ధారించడం, విశదీకరించడం కాలానుగుణ అవసరంతోపాటు ధార్మిక బాధ్యత కూడాను.

## మధ్యేమార్గాన్ని చూపే ఖుర్‌ఆన్, సున్నత్ బోధనలు

ఖుర్‌ఆన్, సున్నత్‌లు మహిళల విషయంలో అతి విలువైన, మధ్యస్థమైన, న్యాయవంతమైన బోధనలను అందజేశాయి. ముస్లిమే తరులలో సందేశ ప్రచారం కొరకు వీటిని మొదటి నుండి నిర్ధారించడం ఎంత అవశ్యకమైనదో ముస్లిం సమాజం కొరకు కూడా అంతే అవశ్యకమైనది. ఇది ఒక విప్లవాత్మకమైన ప్రయత్నం. దీన్ని నిర్వర్తించకుండా మనం

ఈ సమాజాన్ని ప్రక్షాళించలేము. ప్రస్తుత కాలమాన పరిస్థితుల్లో ఇస్లామీయ విధానాలపై దీన్ని నిర్మించడం అసాధ్యమవుతోంది.

ముందుగా కొన్ని మాటలు ప్రస్తావించడంలో అతిశయోక్తి లేదని భావిస్తూ క్రింద పేర్కొంటున్నాను.

మొదటి మాట ఏమిటంటే, ప్రస్తుతం ముస్లిం సమాజం రెండు వర్గాలుగా విభజించబడి ఉంది. మొదటిది, పాశ్చాత్య నాగరికత, విద్య, ఇంకా వీటి వలన ఒనగూడే ఆర్థికాభివృద్ధితో ఎంతో ప్రభావితమై ఇస్లామీయ విధానాలను పూర్తిగా విస్మరించింది. అంతేకాకుండా ఈ వర్గం వారు పూర్తి ముస్లిం సమాజ రూపురేఖలను మార్చివేసే ప్రయత్నం చేస్తున్నారు.

రెండవ వర్గంవారు, ఇస్లాం సురక్షితంగా ఉండటానికి పూర్తి శక్తి సామర్థ్యాలను వినియోగించి, ధార్మిక ఉల్లేఖనాలకు అనుగుణంగా తమ జీవితాలను మలచుకుని, వారి క్షేమ సౌభాగ్యాలు ఇందులోనే ఉన్నాయని భావిస్తారు. కాని విచారించాల్సిన విషయమేమిటంటే, ఆధునిక సాంప్రదాయాలు, విజ్ఞానపరమైన అభివృద్ధి మనలను లోబరుచుకోవటం వల్ల మన ప్రాచీన ఆలోచనలు, ఆచార వ్యవహారాలు ఒక్కొక్కటిగా రూపుమాసి పోతున్నాయి. ఆధునిక జీవన అవసరాలను దృష్టిలో ఉంచుకుని వాటిని యధా ప్రకారంగా అవలంబించటం కష్టతరమైనదిగా గోచరిస్తోంది.

## ఇస్లామీయ ఉద్యమం- దాని పాత్ర

ఇలాంటి పరిస్థితులలో ఖుర్ఆన్, సున్నత్‌ల మూల వచనాలను బహిర్గతం చేయడంతో పాటు ఆరోగ్యకరమైన, ధర్మసమ్మతమైన, ప్రభావవంతమైన కోరికలకు అనుగుణంగా వాటిని సమాజంలో విస్తరింపజేయడానికి ఇస్లామీయ ఉద్యమం మార్గదర్శకత్వం వహించాల్సి

ఉంది. ఈ ప్రయత్నాన్ని శ్రేయోదాయకంగా మలచడానికి క్రింద పేర్కొనబడిన ధైర్యసాహసాలను కనబరచవలసి ఉంది:

అన్నింటికంటే ముందుగా దైవప్రవక్త (స) గారి జీవిత కాలంలోను, తదనంతరం ఖిలాఫతె రాషిదా కాలంలోనూ స్థాపించబడిన మదీనా మునవ్వరా సమాజ అధ్యయనం చేయాల్సి ఉంది. ఆ సమాజంలో మహిళల పాత్ర ఎలా ఉండేది? వారి హక్కుల విషయంలో ఏఏ ఆజ్ఞలు, ఉత్తరువులు దృష్టిలో ఉంచుకోబడ్డాయి? కుటుంబం, సాధారణ సామాజిక జీవితంపై ఎంతవరకు వాటి ప్రభావం ఉంది? మహిళలు కేవలం గృహాల వరకే పరిమితం చేయబడ్డారా? లేక వారి సామాజిక జీవనంలో స్త్రీ ఏమైనా ప్రత్యేక పాత్రను పోషించిందా? దైవప్రవక్త (స) గారు సామూహిక విషయాలలో మహిళల సలహాలను తీసుకునేవారా? అత్యవసర సందర్భాలలో ఆయన (స) కేవలం పురుషులతోనే ప్రమాణం (బైత్) తీసుకున్నారా? లేక మహిళలను కూడా యోగ్యులుగా భావించి వారితోనూ ప్రత్యేకంగా ప్రమాణం తీసుకున్నారా? ఆయన (స) ధార్మిక బోధనలు, శిక్షణల కొరకు కేవలం పురుషులనే మాధ్యమాలుగా నియమించారా? లేదా స్త్రీలనూ అందులో భాగస్వాములుగా చేశారా? ఆ సమాజంలో స్త్రీ పురుషుల మనోభావాలు ఒకదానితో మరొకటి పూర్తిగా వేర్పాటు ధోరణిలో ఉన్నాయా? సామూహిక జీవితపు వ్యవహారాల్లో స్త్రీ పురుషుల మధ్య పరస్పరం ఏలాంటి సహాయ సహకారాలు లేకుండా ఉన్నాయా? ఆర్థిక రంగంలో అనగా, వ్యాపారం, సముపార్జనలలో మహిళలు ప్రత్యక్షంగానూ, క్రియాత్మకంగానూ పాల్గొనడానికి నిషేధించబడ్డారా?

ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు పొందడానికి కలగాలపులగం అయిన చరిత్రలను ఆధారం చేసుకునే అవసరం లేకపోవడం మన

అదృష్టం! దీని కొరకు అతి విలువైన హదీసుల కూర్పు మన వద్ద ఉంది. ఇందులోనే మనమందరం ఆయా ప్రశ్నలన్నింటికీ సమాధానాలను పొంద వచ్చు. ఖుల్ఫాయే రాషిదీన్‌లకు చెందిన కాలం వరకూ, వారికి సంబంధించిన చారిత్రాత్మక ఆధారాలు మన వద్ద ఉన్నాయి. ఆ కాలానికి ఉన్న గొప్ప తనమేమిటంటే, అది దైవప్రవక్త (స) వారి జీవిత కాలానికి అద్దం పడుతూ, ఖుర్‌ఆన్, సున్నత్‌ల ప్రతిబింబంగా ఉంది. దీని రెండవ గొప్పతనం ఏమిటంటే, ఇది వ్యర్థమైన విషయాలకు దూరంగా ఉంటూ విరోధానికి కారణమయ్యే సాంప్రదాయాల నుండి విడివడి ఉంది. ఇందులో ఇస్లామేతర అంశాలు చోటుచేసుకునే ప్రసక్తే లేకుండాపోయింది.

## విశాలమైన బుద్ధీచాతుర్యత కలిగిన సమాజం

ఇప్పుడు వివరించి చెప్పే అవకాశం లేదు. కాని ఈ లోతైన అధ్యయనం వల్ల కొన్ని మాటలు ఖచ్చితంగా నిరూపించబడతాయి. మొదటిది ఏమిటంటే, ఆ సమాజం మహిళల విషయంలో విశాల హృదయం కలిగి, విస్తారమైన బుద్ధీచాతుర్యతల సమాజంగా ఉండేది. అది స్త్రీ గౌరవాన్ని గట్టి పునాదులపై నిలిపింది. స్త్రీకి పురుషులతో సమానత్వాన్ని ప్రసాదించింది. తల్లిగా ఆమె పాదాల క్రింద స్వర్గం ఉందనే శుభవార్తనిచ్చింది. భార్యగా ఆమె హక్కులను స్పష్టంగా నిర్ణయించి, ఆమె పట్ల మృదువైఖరి అవలంబించడాన్ని సత్కార్యంగా, ఇంకా అది తఖ్వా (భయభక్తుల)లో ఒక భాగంగా పేర్కొంది. ధర్మసంస్థాపనా నాయకుడయిన విశ్వనాయకుడు (స) ఉన్న ఆ సమాజంలో పురుషుల వలెనే స్త్రీలు కూడా మంచి పనులను ఆజ్ఞాపిస్తూ, చెడు పనుల నుంచి వారించడానికి కృషి చేసేవారు. ఇంకా స్త్రీ డబ్బు, క్రయ విక్రయాల్లో, సామాజిక సేవల్లో, సంభాషణల్లో పాల్గొనేది. తనవంతు

సహాయ సహకారాలనూ అందించేది. మాతృమూర్తులు తమ నవ యువకు లను అల్లాహ్, దైవప్రవక్త(స)లకు అప్పగించడం వల్లనే వారు ధర్మపోరా టంలో ప్రాణాలను అర్పించగలిగారు. ఎందరో మహిళలు స్వచ్ఛందంగా యుద్ధాలలో పాల్గొన్నారు.

రెండవ విషయం ఇలా విశదమవుతుంది: అది స్త్రీ పురుషులు కలివిడిగా మసలుకునే సమాజం కాకపోయినా వివిధ రంగాలలో, యుద్ధ మైదానాలలో వారి మధ్య ఆరోగ్యకరమైన, భేదభావాలు లేని వ్యవహార వైఖరులు ద్యోతకమయ్యేవి. సామూహిక వ్యవహారాలను, పనులను చక్క పరచుకోడానికి, ధార్మిక శిక్షణ, విద్యాభ్యాసం, విజ్ఞాన ప్రాప్తి కొరకు, ఆర్థిక పరమైన వ్యవహారాలు గోచరించేవి. వాటిలో స్త్రీ పురుషులు పరస్పరం సహాయ సహకారాలందించుకునేవారు. ఖుర్‌ఆన్ బోధనలకు అను గుణంగా, కౌటుంబిక జీవనంలో పరస్పర ప్రేమానురాగాలు, స్నేహ వాత్స ల్యాలను కలిగి ఉండి అనుబంధాలను పటిష్టపరచుకునేవారు. ఒకరి పట్ల మరొకరు ఉత్తమ రీతిలో వ్యవహరిస్తూ, వారి వారి హక్కులను, విధులను నిర్వర్తించే సమూహం ఉండేవారు. స్త్రీ తన భర్త నుండి తన హక్కులను పొందడానికి విశ్వనాయకుడు అయిన మహాప్రవక్త (స) వారి ఎదుట వాక్ స్వాతంత్ర్యపు హక్కును కలిగి ఉండేది. ఈ హక్కు ఎంతవరకు వినియో గించుకోబడేదంటే, దాంపత్య హక్కును పొందడానికి భర్త నఫీల్ ఆరాధన లలో అసాధారణంగా నిమగ్నమవడాన్ని గురించి నిలదీస్తూ తన విషయంలో న్యాయం చేయమని దైవప్రవక్త (స)కు విన్నవించుకునే ఈ సందర్భం దప్పిక గొన్నదిగా, అసంపూర్ణంగా ఉండిపోయే ప్రమాదం ఉంది కనుక కొన్ని ఉదాహరణలు మీ ముందు ఉంచుతున్నాను.

**ఇస్లాం సందేశప్రచార ప్రారంభకాలంలో మహిళలు పురుషులతో**

భుజం భుజం కలిపి ఏ విధంగా బలిదానాలు అర్పించారో తెలుసుకోవాలంటే దానికి ఒక ఉదాహరణ ఇది. ఇస్లాం కొరకు ప్రాణాలర్పించి అమరగతి (షహాదత్) పొందిన మొట్టమొదటి మహిళ హజ్రత్ సుమయ్యా (రజి). హజ్రత్ ఉర్వా బిన్తె అబ్దుల్ ముతల్లిబ్ (రజి) దైవప్రవక్త (స)కు సహాయసహకారాలు అందించేవారు. ఖురైష్ వంశంలోని మహోన్నత కుటుంబానికి చెందిన మహిళ హజ్రత్ ఉమ్మె షరీక్ (రజి) ఇస్లాం సందేశాన్ని ప్రజలకు అందజేసి, వారు ఇస్లాం స్వీకరించేలా చేసేవారు.

బుఖారిలో ఇబ్నె అబ్బాస్ (రజి) ఇలా ఉల్లేఖించారు: ఈదుల్ ఫిత్ర్ (రమజాన్ పండుగ) నమాజ్ తర్వాత దైవప్రవక్త (స) పురుషులను ఉద్దేశించి ప్రసంగించారు. దాని తర్వాత వారి మధ్యలో నుండి నడిచి మహిళల వద్దకు వెళ్ళారు. వారి ముందు సూరె అల్ ముమ్‌తహినహ్‌లోని ఆయత్ చదివి విన్పించారు.

> **"ప్రవక్తా! విశ్వసించిన స్త్రీలు బైత్ చేయటానికి నీ వద్దకు వచ్చి, తాము ఎవరినీ అల్లాహ్‌కు సాటిగా నిలబెట్టము అనీ, దొంగతనం చేయము అనీ, చేతుల మధ్య ఏ అపనిందనూ కల్పించుకురాము అనీ, ధర్మసమ్మతమైన మంచి విషయాలలో మీకు అవిధేయత చూపము అనీ ప్రమాణం చేస్తే, వారి నుండి బైత్ తీసుకో; వారిని క్షమించు అని అల్లాహ్‌ను ప్రార్థించు."** ***(60 : 12)***

తర్వాత ఆయన (స) "మీరందరూ దీన్ని విశ్వసిస్తున్నారా?" అని ప్రశ్నించగా, వారిలో ఒక స్త్రీ 'అవును' అని సమాధానమిచ్చింది. తర్వాత ఆయన (స) వారిని దానధర్మాలు చేయవలసిందిగా పురమాయించారు.

బుఖారి, ముస్లిం ఉల్లేఖనాల వల్ల దైవ ప్రవక్త (స) జీవితకాలంలో జమాఅత్‌తో నమాజులు చేయడానికి మహిళలందరూ మస్జిదె నబవీ (స)లో హాజరయ్యేవారని తెలుస్తోంది.

# ఇస్లామీయ యుద్ధాలలో మహిళల పాత్ర

యుద్ధరంగాలలో సహాయసహకారాలు అందజేయడంలోనూ, ప్రత్యక్షంగా పాలుపంచుకోవడంలోనూ మహిళలు పురుషులతోపాటు భుజం భుజం కలిపారు. స్వయంగా హజ్రత్ ఆయెషా (రజి) కూడా ఉహుద్ యుద్ధంలో గాయపడ్డ ముజాహిద్ (ధర్మయోధు)లకు నీరు త్రాపించి సేవ చేశారు. హజ్రత్ ఉమ్మె అమ్మారా, నసీబా బిన్తె కాబ్ (రజి) అనేక యుద్ధాలలో పాల్గొన్నారు. ఉహుద్, హునైన్ యుద్ధాలలో అత్యంత ధైర్యసాహసాలు కనబరుస్తూ ఎందరో దైవవిరోధులను హతమార్చారు (అల్ మగాజి, 2వ భాగం, 735 పేజి). ముసైలమా కజ్జాబ్‌కు వ్యతిరేకంగా యమామ యుద్ధంలో పాల్గొన్నారు. ఈ యుద్ధంలో పాల్గొనడానికి ఆమె హజ్రత్ అబూ బక్ర్ సిద్దీఖ్ (రజి) అనుమతి తీసుకున్నారు (అల్ బదాయత వన్ నిహాయత, 2వ భాగం, 323 పేజి; అల్ మసీరతుల్ హల్బా, 2వ భాగం, 509 పేజి). హజ్రత్ అస్మా బిన్తె యజీద్ (రజి) వీర మహిళ. ఆమె యర్మూక్ యుద్ధంలో ధైర్యసాహసాలను కనబరుస్తూ ఇతర ముస్లిం మహిళలతో కలసి చాలా మంది రోమన్లను హతమార్చారు (అల్ బదాయత వన్ నిహాయత, 7వ భాగం, 13 పేజి; తారీఖ్ తబ్రీ, 2వ భాగం, 338 పేజి). ఇంకా ఆమె ఉహుద్, కందక యుద్ధాలలోనూ పాల్గొన్నారు (అల్ అఖదుల్ ఫరీద్, 3వ భాగం, 223 పేజి; మగాజి, 1వ భాగం, 315 పేజి). వీరేగాక ఇంకా హుమ్నా బిన్తె జహష్, ఉమ్మె సునైన్ సఖ్మియా, లైలా గఫ్ఫారియా (గజ్వా-ఎ-ఉహుద్, అసాబా), సుఫియా బిన్తె అబ్దుల్ ముతల్లిబ్ (రజి) (గజ్వా-ఎ-కందక్, అసాబా), ఉమ్మె హారాన్ (రజి), ఇంకా ఎందరో మహిళలు యుద్ధరంగాలలో సహాయసహకారాలు అందించారు. నిజానికి యుద్ధాలలో పాల్గొనడం అనేది మహిళల విధుల్లోనే లేదు. కాని ఐచ్ఛికంగా, గౌరవ

ప్రదంగా, సంతోషంతో ఇలాంటి సహాయసహకారాలు అందజేయవచ్చు. ఈ విషయంలో వారి కొరకు ఎలాంటి నిషేధమూ ఉండేది కాదు. కాని ఇక్కడ చర్చనీయాంశం యోగ్యత లేదా అయోగ్యతలది కాదు. అసలు ఉద్దేశ్యం ఈ విషయాన్ని గుర్తించి చూపడమే. మదీనా మునవ్వరాలోని మహిళలు యుద్ధ సమయాల్లో తోలుతిత్తులను నీటితో నింపి తమ వీపులపై మోసుకుని వచ్చి ముజాహిద్‌లకు నీరు త్రాపించేవారు. క్షతగాత్రులకు కట్లుకట్టేవారు. అవసరమైతే ఆయుధాలను చేతబుచ్చుకుని శత్రువులతో పోరాడేవారు. దీనినిబట్టి సామాజిక వ్యవహారాలలో కూడా మహిళలు క్రియాశీలమైన ప్రత్యక్ష సంబంధం కలిగి ఉండేవారు అని ఆధారాలు కూడా వెల్లడి చేస్తున్నాయి. ఇవి ఒక సభ్యతా సంస్కారాలు కలిగిన పటిష్ట సమాజం కొరకు అవశ్యకమైనవి. అందువలన ఇస్లాం స్త్రీ పురుషులకు కొన్ని ప్రత్యేకమైన హద్దులను నిర్ణయించింది.

మదీనా మునవ్వరా సామూహిక వ్యవహారాలలోనూ మహిళలతో సమాలోచనలు జరిపేవారనడానికి హజ్రత్ ఉస్మాన్ (రజి), అలీ (రజి)ల ఖిలాఫత్ కాలాన్ని ఒక ముఖ్య ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఆ కాలంలో పురుషులతో సమాలోచనలు జరిపి వారి అభిప్రాయాలు తెలుసుకున్న తర్వాత హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) మహిళల అభిప్రాయాలు కూడా అడిగి తెలుసుకున్నారు (అల్ బదాయత వన్ నిహాయత). వ్యాపార, వ్యవసాయ రంగాలలో మహిళలు పాలుపంచుకోవడాన్ని గురించిన లెక్క లేనన్ని ఉదాహరణలు ఈ కాలంలో దొరుకుతాయి. షరీయత్ కుటుంబాన్ని పోషించే బాధ్యతను పురుషులపై విధిగా నిర్ణయించినప్పటికీ ప్రయత్నించేవారు. అలా వారు చేయడానికి ఎలాంటి నిషేధమూ ఉండేదికాదు. **ఉదాహరణకు, అస్మా బిన్తె అబూ బకర్ (రజి) ఆర్థికంగా తమ భర్తకు**

సహాయపడేవారు (బుఖారి). హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) బజారును తనిఖీ చేసే బాధ్యతను షిఫా బిన్తె అబ్దుల్లాహ్ బిన్ అబ్దుషమ్స్‌పై మోపారు.

వివాహానికి సంబంధించిన వ్యవహారాలను గురించి చెప్పుకోవాలంటే ఈ కాలంలో పురుషులు ఏ విధంగా అయితే వివాహ పునర్విచారణ కోరే స్వాతంత్ర్యం కలిగి ఉండేవారో, అదే విధంగా మహిళలు కూడా ఆ స్వాతంత్ర్యాన్ని కలిగి ఉండేవారు. ఇలాంటి సందర్భాలు అనేకం హదీసుల్లో దొరుకుతాయి. ఉదాహరణకు మహిళలు నోటితోను, రాతపూర్వకంగానూ నికాహ్‌ను పునర్విచారించవలసిందిగా కోరారు. ఆయన (స) సన్నిధిలో హాజరయి ఖులా కొరకు దరఖాస్తు చేసుకున్నారు. షరీయత్ ప్రకారంగా, స్త్రీ ఖులా పొందడానికి ఖాజీ వద్ద పునర్విచారణకు అనుమతి పొందవలసి ఉంటుంది. కాని దానికి గల కారణాన్ని, తీర్పును ఆమె బహిరంగంగా ప్రకటించాల్సిన అవసరం లేదు. స్వయంగా దైవప్రవక్త (స) ఒక మహిళ పట్టుదల మేరకు ఆమెకు ఖులా ఇప్పించారు.

ఇంకా జ్ఞానవివేచనల్లోనూ మహిళలు పురుషుల కంటే తక్కువ స్థాయిలో ఏమీ ఉండలేదు. నిజానికి కొందరు గౌరవనీయులైన, మహోన్నతులైన మహిళలు పురుషులకంటే ఒక అడుగు ముందుండేవారు. ఉదాహరణకు, హజ్రత్ ఆయెషా (రజి) తమ హదీసు జ్ఞాన వివేచనాల దృష్ట్యా జనులందరికీ ఆశ్రయంగా ఉండేవారు. హదీసు గ్రంథాలలో ఆమె ఉల్లేఖనాలు అధికంగా దొరుకుతాయి. ఉమ్ముల్ మోమినీన్ (విశ్వాసుల మాతృమూర్తి) హజ్రత్ హఫ్జా బిన్తె ఉమర్ (రజి) తమ జ్ఞాన వివేచనల పరంగా ఎంతో విశ్వసనీయులుగా పరిగణింపబడేవారు. వారి శ్రేష్ఠమైన అభిప్రాయాలు ఎంతో విశ్వసనీయమైనవిగా పరిగణింపబడేవి. వారి శ్రేష్ఠమైన అభిప్రాయాలు ఎంతో లోతైనవిగా, దూరదృష్టిని కలిగి ఉండేవి. (హయాతె

అస్‌హాబా, 1వ భాగం, 476 పేజి). ఇవి కేవలం రెండు ఉదాహరణలు మాత్రమే. దీనిని బట్టి ఆ కాలం జనులు పురుషులతో పాటు మహిళల వైపు కూడా తమ సమస్యలను పరిష్కరించుకోవడానికి, విద్యాజ్ఞానార్జనల కొరకు మరలేవారని తెలుస్తోంది.

# ఇస్లామీయ సమాజ విశిష్టత

ఇస్లామీయ సమాజ విశిష్టత ఏమిటంటే, అది ఖుర్‌ఆన్, సున్నత్‌ల హితబోధలను, నియమాలను, శాసనాలను అనుసరిస్తుంది. ఆ సమాజం లోని వారు ఖుర్‌ఆన్‌ను మూలాధారంగా చేసుకుని అనుసరిస్తారు. అందులో అల్లాహ్ స్త్రీ పురుషులను ఒకరి కొరకు మరొకరు ప్రేమాభిమానాలకు, ప్రశాంతతకు మూలకారణాలుగాను, ఎలాగైతే దుస్తులు ఒకరి సతర్‌ను దాస్తాయో, ఇంకా శరీర భాగాలను గుట్టుగా ఉంచుతాయో అలాంటి దుస్తులుగా వారిని పేర్కొన్నాడు. వీరిని అల్లాహ్ పరస్పర సహాయకులుగా, తోడూ నీడలుగా, సంరక్షకులుగా చేశాడు.

> **"విశ్వాసులైన పురుషులూ, విశ్వాసులైన స్త్రీలూ, వారందరూ ఒకరికొకరు సహచరులు, వారు మేలు చేయండి అని ఆజ్ఞాపిస్తారు. చెడు చెయ్యవద్దు అని నిరోధిస్తారు."** ***(అత్ తౌబా-9 : 71)***

స్త్రీ పురుషులు ఇద్దరూ అల్లాహ్ దాసులు అనే విషయాన్ని అల్లాహ్ ఇలా పేర్కొన్నాడు :

> **"అల్లాహ్ మానవులను ఏ స్వభావం ఆధారంగా సృష్టించాడో దానిపై స్థిరంగా ఉండండి."** ***(అర్ రూమ్-30 : 30)***

దీని తర్వాత ఇస్లాం అరబ్బు ద్వీపకల్పం నుండి అత్యంత వేగంగా ఇతర దేశాల్లో వ్యాపించింది. ప్రజలు గుంపులు గుంపులుగా ఇస్లాం

స్వీకరించి ముస్లింలుగా మారసాగారు. కాని ఈ వ్యాప్తితోపాటు ధార్మిక విద్యాజ్ఞాన బోధనల కొరకు సక్రమమైన ఏర్పాట్లు ఒనగూడలేదు. ఎక్కడెక్కడ అయితే ఇస్లాం ఆధిక్యత పొందిందో ఆ దేశాలు, సమాజాలలో ఇస్లాంకు పూర్వం ఉన్నటువంటి ఇతర సభ్యతా నాగరికతలు ప్రబలి ఉండేవి. ఉదాహరణకు, బాజ్ నతీనీ నాగరికత, భారతీయ నాగరికత, ఈరాన్ నాగరికత మొదలుగునవి. వీటిని అనుసరించే ప్రజలు ముస్లి ములుగా మారిపోయారు కాని తమ జీవితాల్లో వారి వెనుకటి నాగరికత లకు చెందిన ఆచార వ్యవహారాలను, సాంప్రదాయాలలోను చాలా వాటిని ఆచరిస్తూనే ఉండేవారు. ఈ నాగరికతలు మిళితం అవడం వల్ల సమాజంలో దోషాలు, చెడుగులు ఉత్పన్నమయ్యాయి. దీనితోపాటు దీర్ఘకాలం గడిచిపోవడం వల్ల వారు మదీనా మునవ్వరా సొసైటీ ఉన్నట్లుగా ఖుర్‌ఆన్, సున్నత్‌ల అసలైన స్వచ్ఛమైన, పరిశుద్ధమైన సెలయేరుకు దగ్గర కాలేకపోయారు. ఈ కారణాన ఇందులో మిళితమై ఉన్న వాటిని రద్దు పరచి, ప్రజలను వాటి నుండి కాపాడాలనే ఆలోచన ధార్మిక సంస్థల్లో అధిక మవసాగింది. ఈ మిళిత నాగరికతలో ఎక్కడైతే ఆచార వ్యవహారాలు, సాంప్రదాయాలు పొడసూపుతున్నాయో, అక్కడే భాషాజ్ఞానం, తత్వజ్ఞానం, క్రియాత్మక జీవనం కూడా దీనికి తోడుగా అందుబాటులోనికి వచ్చేశాయి. వివాహ సాంప్రదాయాలపై కూడా దీని ఛాయ పడింది. మహిళల పట్ల సమాజ దృక్పథం కూడా మారిపోయింది. ఈ మిళిత ప్రభావాలను వ్యాపిం పజేసే మార్గాలలో ఒక మార్గం ఈ కాలపు భాషాజ్ఞానం. ఇది ప్రతి ఒక్కరికీ మనసుకింపైనవిగా ఉండే ప్రత్యేక కథలు, గాథల సంగ్రహణాలు. అలీఫ్ లైలా లాంటి గాథలు స్త్రీని మాయలమారిగా, ద్రోహిగా, కృతఘ్నురాలుగా, కామమోహాలను ప్రేరేపించే జాతిగా చిత్రించి పేర్కొన్నాయి. ఒకవేళ ఆమెకు

స్వాతంత్ర్యాన్ని ఇచ్చినట్లయితే ఆమె ద్రోహానికి పాల్పడుతుందని, మోసంతో తన పని నెరవేర్చుకుంటుందని, కామవాంఛలకు సులభంగా బలి అయి పోతుందనే అభిప్రాయాలను బలపరుస్తూ, వీటిని కాలరాయడానికి స్త్రీలను కట్టడిలో ఉంచాలనే భావన ఏర్పడింది. ఇలాంటి గాధలను ప్రతీ ఒక్కరు ఇష్టపడడం వల్ల బుద్ధిపూర్వకంగానో లేక అజ్ఞానం వల్లనో ఖుర్ఆన్, సున్నత్‌లు బోధించిన దృష్టికోణంపై అడ్డుతెర పడవేయబడింది. బాజ్ నతినీ నాగరికత ముస్లింలను ఎంతగా ప్రభావితం చేసిందంటే, హిజాబ్ స్పష్టమైన రూపం మన సమాజంలో విడదీయరాని ఒక భాగంగా మారిపోయింది. హిందూ సాంప్రదాయంతో సంబంధమేర్పడటం వల్ల అది స్త్రీ స్థానాన్ని మరింత దిగజార్చేసింది. ఫలితంగా ఈ సంకటం నుండి మనం జాగ్రత్త పడటానికి, దాన్ని రూపుమాపడానికి మన కార్యాచరణ ఒక మెరుగైన బాట వేసింది.

## సామాజిక చెడుగులు

స్థానిక కల్చర్, ఇస్లామేతర ఆలోచనా విధానాల పర్యవసానంగా మనం అలవర్చుకున్న సామాజిక జీవనానికి చెందిన ఆచార సాంప్రదాయాలు దీనికి ప్రమాణాలుగా ఉన్నాయి. నికాహ్ లాంటి సులువైన శుభకార్యాన్ని కట్నకానుకలు, ఇంకా ఇతర ఆచారాలతో కలుషితం చేసి, ముస్లిం సమాజంలో దీన్ని అతికష్టమైన తంతు చేసివేశారు. తలాఖ్‌నూ అతి హేయమైనదిగా చేసేశారు. వితంతువు అంటరానిదిగా చెప్పబడేది. హిందూ సమాజంలో వలె భారత ముస్లిం సమాజంలో కూడా ఆడ పిల్లను పెను భారంగా భావించేవారు. ఆడపిల్ల పుడితే అది ఒక సంకటంగా నిర్ధారించ బడేది. అవధ్‌లో అనేక జమీందారులు, ధనవంతులు మహిళల

వారసత్వపు హక్కులను కొల్లగొట్టటానికి బ్రిటన్‌కు చెందిన వారసత్వపు శాసనాలను అమలు పర్చుకున్నారు. దీని ప్రకారం కేవలం మగ సంతానం మాత్రమే అధిక సంపదలకు యోగ్యమైనది. నికాహ్ రద్దు (ఖులా) చేసుకునే హక్కు స్త్రీని నుండి తొలగించి, మహిళలకు లజ్జాకరమైనదిగా నిర్ణయించ బడింది. చివరకు నికాహ్ ప్రస్తావన, స్వీకరణ సమయంలో అమ్మాయి మౌనం వహించడాన్ని అది ఆమె 'సమ్మతి'గా నిర్ధారించబడేది. ముస్లిం సమాజంలో ఎలాంటి సాంప్రదాయాలు జొరబడ్డాయంటే, స్త్రీలు తమ ఇంట్లోనే తమ ఇంటి మగవారితో కలసి కూర్చుని అన్నం తినకూడదు. ఏ ధర్మం అయితే జ్ఞానార్జనను ఈమాన్ (విశ్వాసం)లోని ఒక భాగంగా పేర్కొందో ఆ ధర్మంలోనే సుదీర్ఘకాలం వరకు మహిళలు జ్ఞానాన్ని ఆర్జించ డాన్ని తప్పుగా, దోషంగా భావించబడేది.

## సంస్కరించే ప్రయత్నం

ఒకవైపు ఈ సామాజిక చెడుగులు పురివిప్పుతూ ఉంటే, మరోవైపు ధర్మాన్ని సంరక్షించి, ఇస్లామేతర సాంప్రదాయాలు, అజ్ఞానపూరితమైన ఆచార సాంప్రదాయాల నుండి దాన్ని కాపాడేందుకు, వాటికి వ్యతిరేకంగా అడ్డుకట్ట వేయటానికి ధార్మిక సంస్థలు దైవాజ్ఞలను అంగీకరించి, చెడుగులు, షైతాన్ ప్రేరణల నుండి శరణు పొందే అవసరం మహిళలకే అధికంగా ఉందని ఇస్లామీయ శాసనాలకు కొత్త వివరణలివ్వడం తమ కర్తవ్యంగా భావించారు. కొందరు మహిళల హక్కులు భర్త అభీష్టంపై ఆధారపడి ఉన్నాయనే వివరణలు ఇచ్చారు. దీనివల్ల మహిళలు పిల్లల శిక్షణ భర్త ఆజ్ఞమేరకు, అతని ఇష్టానుసారంగా చేస్తారని భావించబడింది. కుటుంబ నిర్వహణ అయినా లేదా పిల్లల శిక్షణ అయినా, అవి కేవలం

పురుషుల హక్కు, వారి బాధ్యతలుగా పేర్కొనబడింది. ఫలితంగా మహిళలకు ఎలాంటి అధికారాలు లభించకపోగా వారిని కేవలం సేవకులుగా మాత్రమే భావించేవారు. ఖుర్‌ఆన్, దైవప్రవక్త (స) వారి సున్నత్‌లు మహిళలను తమ సిరిసంపదలకు, ఆస్తులకు యజమానులుగా చేశాయి. సున్నతె సహీహ్ సాబ్తా ప్రకారం, మహిళలు వాటి నిర్వహణా బాధ్యతలు కూడా స్వయంగా నిర్వర్తించవచ్చు. కాని ఈ హక్కుపై మన సాంప్రదాయాలు వారు భర్తల సహాయం లేకుండా వాటి నిర్వహణ చేయలేరని నిర్బంధాలు, హద్దులు నియమించాయి. స్వయంగా సొంత వ్యాపారం చేయడం చాలా దూరమైన విషయం, పురుషులతో పాటు స్త్రీలు ప్రాపంచిక వ్యవహారాల్లో పాలుపంచుకోవడం ప్రతీకోణంలోనూ సిగ్గుచేటుగా నిర్ధారించబడేది. సాముహిక వ్యవహారాల్లో మహిళలు జోక్యం చేసుకోవడాన్ని పూర్తిగా నిషేధించబడింది. ఎందుకంటే వారు ఆమెను బుద్ధిహీనురాలుగా భావించేవారు. ఆమె చంచల స్వభావాన్ని నిరూపించడానికి 'స్త్రీ ప్రక్కటెముకతో పుట్టించబడింది' అనే మహాప్రవక్త (స) వారి ఉపదేశాన్ని పేర్కొంటూ అందులో స్త్రీలోని ఇస్లామేతర భావనలకు విరోధం చేయబడిందని నిరూపించాలనే ఉద్దేశ్యంతో హదీసె నబవీ (స) భావాన్ని అపార్థాలకు గురిచేశారు.

ఉమ్మత్‌కు చెందిన ఉలెమాలు ప్రతి యుగంలోనూ మహిళల హక్కులు, దాంపత్య బాంధవ్యాలకు సంబంధించిన సరైన ఇస్లామీయ ఆధారాలను తెలుపడం వల్ల, విద్యాబోధన, విశదీకరణల ద్వారా సంస్కరించే ప్రయత్నం కొనసాగిస్తూనే వస్తున్నారన్నది వాస్తవమే! కాని నిజమైన ఇస్లామీయ సాంప్రదాయాలు, శాసనాలను నీచమైనవిగాను, అనవసరమైనవిగాను ఎంచుతున్న వారిని ఈ ప్రమాదం నుండి జాగ్రత్తపడేలా

చెయ్యాలనే వ్యాజ్యం, అతిశయోక్తులు ఆధిక్యత పొందాయనే భావనలు మిళితమమవడం వల్ల ఈ పనిని నిర్వహించలేకపోయారు. ధార్మిక సంస్థల ధైర్యాన్ని పెంపొందింపజేస్తూ, వారి వద్దనున్న సాధనా సంపత్తిని యధా తథంగా ఉంచుతూ, ఆమెను అణచివేత నుండి కాపాడి సంరక్షణ చేకూర్చే ఈ ప్రయత్నంలో ఇస్లామీయ బోధనలు, ముస్లిం సమాజంలో నాగరికతా సాంప్రదాయాల మిళితాలను వేరుపర్చే చికిత్స చేయలేకపోయారు.

పై సంభాషణలో నిరూపణలు, ధైర్యసాహసాల ఈ ప్రయత్నంలో అన్నింటికంటే ముందుగా మనం మదీనా మునవ్వరాలోని సామాజిక జీవనాన్ని గురించి మొదటి నుండీ అవలోకనం చేయాల్సి ఉందని, దీని లోని ముఖ్యాంశాలను వడపోసి ముందుంచాల్సిన అవసరం ఉందనీ మేము మనవి చేశాము. మదీనా మునవ్వరా సామాజిక చరిత్రను గురించి తెలియజేసే హదీసు పుస్తకాలు, ధృవీకరించబడిన చరిత్రల సంగ్రహణం మనకు అందుబాటులో ఉందని కూడా మేము మనవి చేసుకున్నాం. రెండవ వైపు, ముస్లిం అనుచర సమాజం (ఉమ్మతె ముస్లిమా) సుదీర్ఘ చరిత్రను లోతుగా అధ్యయనం చేయడం కూడా ఎంతో అవసరం. ఎందుకంటే ఆచార వ్యవహారాలు కలగలసిపోవడం, మదీనా మునవ్వరా లోని పవిత్రమైన సొసైటీల మధ్య కాలాంతరం ఉండటం వల్ల ఏ ఇస్లా మేతర భావనలు, ఆచార సాంప్రదాయాలు అయితే ముస్లిం సమాజంలో ప్రవేశించాయో వాటిలో ఎక్కువ అంశాలకు మతతత్వపు రంగును పులమటం జరిగింది. వాటిని మనం సులభంగా వేరుపర్చవచ్చు.

## మహిళలు - ఇస్లామీయ బోధనలు

మహిళలకు సంబంధించిన ఇస్లామీయ బోధనలను, శాసనాలను

మొదటి నుండీ జాగరూకం చేసి వాటిలోని నిజమైన శుభాలను వెల్లడించాలి. ఇది విప్లవాత్మకమైన ముందడుగు. ఇది ఎలాంటి ఆశయమంటే, దీని ప్రాప్తి ఎప్పుడూ ఉలెమాలు, ఉమ్మత్‌ను సంస్మరించే సంస్కర్తల కళ్ళ ఎదుట లక్ష్యంగా నిలిచిపోయింది. ఇది పురాతనమైన సాంప్రదాయాలను వ్యతిరేకించడమే కాకుండా, ఖుర్‌ఆన్, సున్నత్‌లలో అంతర్భాగమై ఉన్న ఈ పరిపూర్ణ శుభం వైపునకు ముస్లింలను ప్రత్యేకంగా, ఇతర మానవులకు సర్వసాధారణంగా పిలుపునిచ్చే సందేశ ప్రచారపు పర్యాయ పదం. వీటిని అవలంబించనట్లయితే మహిళలకు వారి హక్కులూ దొరకవు, న్యాయం, మధ్యేమార్గంతో కూడిన సమాజమూ ఎన్నటికీ స్థాపించడం సాధ్యపడదు.

## మహిళల ఆత్మన్యూనతా భావం

ఈ మైదానంలో ఇస్లామీయ ఉద్యమం నాయకత్వం వహించాల్సి ఉంది. పాశ్చాత్య నాగరికతాదాడుల నుండి మీరు మీ కుటుంబాన్ని, అలా కాకపోయినట్లయితే మీ మహిళలను కాపాడటం అసాధ్యమవుతుంది. అనేక సంస్థలు, సమూహాలు ఒక్కొక్కటి చొప్పున ఈ విషయంలో విడిపోతున్నాయి. అంతేకాకుండా ఈ వరదలో ఖుర్‌ఆన్, సున్నత్‌లు బోధించిన శాసనాలు కూడా కొట్టుకుపోయాయి. వీటి ఫలితంగా మతం, ఇస్లామీయ ఉద్యమాలు రెండూ మహిళలను నీచమైనవారుగా భావిస్తున్నాయని, వారిని బంధించి ఉంచుతున్నాయని, వారి ధర్మసమ్మతమైన హక్కుల నుండి వారిని దూరంగా ఉంచుతున్నాయని మహిళలు భావిస్తున్నారు. ఈ కారణాల వల్ల వారు పాశ్చాత్య నాగరికతకు దాసోహమవుతున్నారు. ఇస్లామీయ ఉద్యమాన్ని గురించి వారు పాపపూరితమైన అనుమానాలలో కూరుకుపోయారు. మనం పూర్తి ధైర్యసాహసాలతో, విశ్వాసం, నమ్మకాలతో,

మహాప్రవక్త (స) వారి నాయకత్వంలో మహిళల స్థానాన్ని, హోదాను నిర్ణయించిన మదీనా మునవ్వరాలోని సొసైటీని మరలా పునరుజ్జీవింప జేయాలి. ఖుర్‌ఆన్ బోధనల అంతరంగీకులు, ఆయన (స) వారి సహాబా (రజి)లు కాకుండా మరెవరు కాగలిగేవారు? నిర్భయంగా వారిని దూషించే ఈ సమాజ ఆచరణలను, ఆలోచనా విధానాలను ప్రక్షాళన చేయాల్సి ఉంది. ఏ చారిత్రాత్మక ఆచరణలకు మనం మతపరమైన యోగ్యత నిచ్చేశామో వాటిని మార్చడానికి మనకు ఇష్టమైన, పసందైన ఎన్ని వస్తువులకు గుడ్‌బై చెప్పవలసి వచ్చినా సరే మనం ఈ ఆలోచనా విధానాన్ని మార్చి తీరాలి.

కొన్ని ధార్మిక సంస్థలు ఇలా అభిప్రాయపడుతున్నాయి: "మదీనా లోని సొసైటీ నిగ్రహం కలిగిన, పవిత్రమైన, పరిశుద్ధమైన సొసైటీగా ఉండేది. కాని ఇప్పుడు మనం ఎలాంటి యుగంలో జీవిస్తున్నామంటే ఇక్కడ నిషిద్ధమైన కార్యాలను ధర్మబద్ధమైనవిగా భావించే వారి ఆధిక్యత ప్రబలిపోయింది. అందువలన మనం మరిన్ని కట్టుబాట్లను విధించుకో వలసి ఉంది. ఆ సమాజంలో ధర్మసమ్మతంగా ఉండిన కొన్ని ప్రత్యేక కార్యాలను నిషిద్ధమైనవిగా పరిగణించాలి. సామూహిక తోడ్పాటుకు చెందిన అనేక మార్గాలను మూసివేయాలి." కాని ఈ అభిప్రాయాలు రెండు కారణాల వల్ల లోపభూయిష్టమైనవి. మొదటి కారణం ఏమిటంటే, మదీనాలోని సొసైటీలో కూడా చెడుగులు ఉండేవి. కాని వాటి పరిమాణం అతి తక్కువగా ఉండేది. ఖుర్‌ఆన్ మజీద్‌లోని ఆయతె హిజాబ్ స్వయంగా ఈ విషయంపై సాక్ష్యమిస్తోంది. అందులో ఇలా ఉంది:

**"ప్రవక్తా! నీ భార్యలకూ, నీ కూతుళ్ళకూ, విశ్వాసుల స్త్రీలకూ తమ దుప్పట్ల కొంగులను తమపై వ్రేలాడ తీసుకోమని చెప్పు; వారు**

**గుర్తింపబడటానికీ, వేధింపబడకుండా ఉండేందుకూ ఇది ఎంతో సముచితమైన పద్ధతి."** ***(అల్ అహ్‌జాబ్-33 : 59)***

దైవప్రవక్త (స) వ్యభిచారానికి శిక్ష కూడా ఖరారు చేశారు. ఆ సమాజంలో షైతాన్ ప్రేరణలు కొందరు వ్యక్తులు కాలుజారడానికి కారణభూతమయ్యేవి అనే విషయానికి ఇది ఒక ప్రమాణం. అయినాగాని ఆ సొసైటీలో మహిళల నిత్యకృత్యాలను అసహజంగా నిర్బంధించలేదు. పైగా వారికి ఖుర్‌ఆన్ పేర్కొన్న హక్కులన్నింటినీ కార్యరూపంలో ఇవ్వబడ్డాయి. వీటిని మహాప్రవక్త (స) తమ జీవిత ఆదర్శ నమూనాతో నిరూపించారు. ఖుర్‌ఆన్ ఆజ్ఞలు మదీనా మునవ్వరాకు చెందిన పవిత్ర సమాజానికే పరిమితం కాకుండా అన్ని సమాజాల కొరకు ఆదేశించబడ్డాయి. అల్లాహ్ మహిళల స్థానాన్ని, వారి హక్కులను స్పష్టపరిచే సమయంలో కాలపరిమిత మైన, తాత్కాలిక స్థితిగతులను కాకుండా శాశ్వతమైన ఔచిత్యాలను దృష్టిలో ఉంచుకున్నాడు.

మరొక విషయం కూడా విశదీకరించడం అవశ్యకమైనది, ఈ విన్నపంలో కొన్ని ప్రత్యేక పరిస్థితులలో షరీయత్ సర్వసాధారణ ఔచిత్యానికి అనుగుణంగా షరతులు, హద్దులు నియమించలేము అని చెప్పడం నా ఉద్దేశం ఎన్నటికీ కాదు. కాని కేవలం ఈ వాస్తవం వైపు మాత్రమే శ్రద్ధవహింపచేలా చేసి, హద్దులు, నిర్బంధాలు స్వయంకల్పితంగా ఉండకూడదు. అవి ఆచార సాంప్రదాయాలతో, నాగరికతలతో ప్రభావితం కాకూడదు. అవి కేవలం ఖుర్‌ఆన్, సున్నత్‌ల నుండి తీసుకోబడినవి అయివుండాలి. దీని కొరకు ఔచిత్యమైన జ్ఞానం అల్లాహ్, దైవప్రవక్త (స)ల కంటే బాగా ఎవరికుంది? రెండవ విషయం ఏమిటంటే, ఇస్లాం అసలు పునాదులు నిర్బంధాలు, బంధనాలు కాదు; విశాలత, విపులతలు అనే విషయం తెలుసుకోవాలి.

**"మేము ఈ ఖుర్‌ఆన్‌ను నీపై అవతరింపజేసింది నిన్ను కష్టానికి గురిచేయటానికి మాత్రం కాదు."** ***(తాహా - 20 : 2)***

నిర్బంధాల వల్ల అల్లాహ్, దైవప్రవక్త(స) మహిళలకు ప్రసాదించిన హక్కులు, అంతస్థులు ప్రభావం చూపలేనివిగా అయిపోతే, అల్లాహ్, ఆయన ప్రవక్త (స) మహిళలకు ఇచ్చిన స్వాతంత్ర్యాన్ని జైలు, బంధనంగా మార్చేస్తే ఇది క్రూరమైన అత్యాచారమే అవుతుంది. క్రూరత్వ స్వభావం నుండి వారిని కాపాడటం సాధ్యపడదు. ఈ క్రూర స్వభావాన్ని తిరస్కరిస్తారా? లేదా అడుగులు ముందుకు సాగుతాయా? లేక వెనక్కుతగ్గుతాయా? ఆలోచించుకోవాలి.

నిరూపణలు, ధైర్యసాహసాల ఈ ప్రయత్నంలో రెండు ముఖ్య అంశాలు ఉన్నాయి

మొదటి అంశం, ఖుర్‌ఆన్, సున్నత్‌ల మూల శాసనాలు, బోధనలను నిరూపించటం. ఏవైతే దైవప్రవక్త (స), ఖుల్ఫాయె రాషిదీన్‌ల కాలంలో స్థాపించబడిన మదీనా మునవ్వరాలోని ఆ సొసైటీని అనుసరించడం. చారిత్రాత్మక ప్రయాణంలో మిళితమయిన తుచ్ఛ సాంప్రదాయాల నుండి విముక్తి పొందాలి.

రెండవ అంశం, ప్రస్తుత కాలానికి చెందిన స్థితిగతుల నుండి స్వచ్ఛమైన ఇస్లామీయ విధానాలను వేరుపరచి ఆరోగ్యకరమైన, మానవులందరికీ లాభకరమైన మగ్గుదలను నిర్ణయించడం. దీనికొరకు క్రింద పేర్కొన్న మగ్గుదలలపై మనం తక్షణమే శ్రద్ధ వహించాల్సి ఉంది. వీటిలో కొన్ని ఆరోగ్యకరంగాను, మరికొన్ని కలహాలకు మూల కారణాలుగానూ ఉన్నాయి. ముందుగా ఆరోగ్యకరమైన మగ్గుదలను తీసుకుందాం.

1) మహిళల సర్వసాధారణమైన పీడింపులు, దౌర్బల్యం, బలహీనత లను దూరం చేసి, వారికి మానవీయ హక్కులను ఇప్పించే సాధారణ ప్రయత్నం చేయాలి.

2) సామూహిక వ్యవహారాలలో వారి సహభాగత్వంలో పెరుగుదల కొరకు ప్రయత్నించటం.

3) మహిళల్లో పేరుకుపోయిన అజ్ఞానాన్ని దూరం చేసి, జ్ఞానార్జనకు కావలసిన సౌకర్యాలను కల్పించే ప్రయత్నం చేయడం.

4) దాంపత్య జీవితంలో మహిళలకు న్యాయవంతమైన హక్కులను ఇప్పించడానికి ప్రయత్నించడం.

5) స్త్రీని పురుషుడి కంటే నీచమైనదిగా భావించే, ఆడపిల్ల జన్మించ డాన్ని భారంగా, శాపగ్రస్తమైనదిగా భావించే, కట్నకానుకలను వివాహంలో తప్పనిసరి భాగంగా పరిగణించే సర్వసాధారణ సామాజిక దృక్పథంను సరిదిద్దటం.

6) ఆర్థికంగా స్త్రీని బలిష్టం చేసేందుకు ప్రయత్నించడం.

ఆధునిక యుగంలో పైన ప్రస్తావించబడిన మగ్గుదలలు నేడు మహిళలు కలిగి ఉన్న కోరికలు, ఆశలకు మూల స్థానాలు. వీటి మూలం ఇస్లామీయ దృక్పథంతో ఏకాభిప్రాయం కలిగి ఉంది. కాని ఇవి దైవ ఉప దేశాల నుండి స్వతంత్రంగా వాటి వివరణలో అధికమైన లేదా అల్పమైన మార్గాలను జనింపజేస్తాయి.

ఖుర్ఆన్, సున్నత్‌లు పైన ప్రస్తావించబడిన శాసనాలకు మానవ ఇతిహాసంలోనే మొదటిసారిగా వారు పూర్తిగా అర్హులైన స్థానాన్ని వారికి అందజేశాయి. స్త్రీ పురుషులు ఇద్దరినీ ఒకే జంట నుండి పుట్టించడం వల్ల

సమానమైన హోదా ఇవ్వబడింది. మొదటి సారిగా స్త్రీ దృఢమైన అస్తిత్వాన్ని ఒప్పుకుని అన్ని హక్కులు, విధులలో ఒకే విధంగా సంబోధించబడింది. వాటి నియామకంలో మహిళల ప్రత్యేకమైన కార్యస్థలం, ప్రకృతిపరమైన భేదాన్ని దృష్టిలో ఉంచుకోబడింది. సాధారణ మానవుల హక్కులనూ ఇద్దరికీ సమానంగా ఖరారు చేసింది. న్యాయపరమైన శిక్షలను ఇద్దరికీ వేరు వేరుగా పేర్కొంది. పరలోక శిక్షా బహుమానాలలో ఇద్దరినీ వేరువేరు అస్తిత్వాలుగా పేర్కొనబడింది. స్త్రీ అపరాధి, పాపి అని పేర్కొనే క్రైస్తవంలోని అన్యాయ వైఖరిని ఇవి మొట్టమొదటిసారిగా నేలమట్టం చేశాయి. నిజానికి షైతాన్ ప్రేరణకు ఇద్దరూ గురికాగలరని తెలుపబడింది. స్త్రీ పురుషుల హక్కులను వేరువేరుగా పరిగణించాయి. మహిళలను ఆర్థికంగా పటిష్ఠ పరిచింది. సామూహిక వ్యవహారాల్లో వారి సలహాలు, ప్రతిఘటనలను ధర్మసమ్మతమైనవిగాను, ఆదరణీయమైనవిగా పేర్కొని గౌరవనీయమైన స్థానాన్ని ప్రసాదించింది. ముఖ్యమైన విధి అయిన మంచి పనులను ఆజ్ఞా పించటం, చెడుగుల నుండి ఆపడంలో ఒకరికొకరు సహచరులుగా పేర్కొంది. జిహాద్, యుద్ధాలలో వారు పాల్గొనటాన్ని నిషేధించకపోగా కొందరు సహాబియాల ధైర్యసాహసాలను దైవప్రవక్త (స) ఎంతో ప్రశంసిం చారు, మెచ్చుకున్నారు. ఆడపిల్లలకు విద్యాబుద్ధులు నేర్పితే స్వర్గానికి గ్యారెంటీ ఇవ్వబడింది. తల్లిగా ఆమెకు మహోన్నత స్థానాన్ని ప్రసాదిం చబడింది. పరిపాలన, ప్రాతినిధ్యపు సమస్యలను పరిష్కరించడంలో వారి అభిప్రాయాలు, సలహాలకు ప్రాధాన్యత ఇవ్వబడింది. ఇక్కడ ఈ మూల బోధనలను పునరావృతం చేయడం నా ఉద్దేశం కాదు. నా ఉద్దేశం కేవలం పైన పేర్కొన్న నిరూపణలు తమ మూలపరంగా ఇస్లామీయ బోధనలతో ఏకాభిప్రాయం కలిగి ఉన్నాయని మనవి చేయడం మాత్రమే.

ఇస్లామీయ ఉద్యమానికి ఈ మగ్గుదలలను కేవలం ప్రోత్సహిస్తే సరిపోదు. కొన్ని ప్రోత్సహాలు ఎలాంటి ప్రభావాలు చూపుతాయంటే, మీరు వెనుక నడుస్తున్నా మీ మనసు మీరు ఆ శాసనాల సందేశ ప్రదాతగా, దాన్ని ముందుకు నడిపించే ధ్వజవాహకుడు అవ్వాలని కోరుకుంటుంది. కాని ఈ మగ్గుదలను ఆలోచించకుండా ఆచరణలో పెట్టడం కూడా సరైనది కాదు. ఎందుకంటే, ఈ మగ్గుదలల వైపునకు పిలుపునిచ్చేవారు సాధారణంగా మతం, ధర్మంతో అపరిచితమైన వ్యక్తులే అయి ఉంటారు. వీరి ప్రయత్నంలో ఆలోచనాత్మక గందరగోళం ఉంటుంది. వీరి ఆచరణలు, కోరికలు, ఆధునికత పట్ల మక్కువలతో కలుషితమై ఉన్నాయి. ఇంకా ఇందులో పెరుగుదల, తగ్గుదలలు, ఆచరణ నిరాకరణలు కూడా ఉన్నాయి. ఒకవేళ మనం ప్రయత్నిస్తే ఇస్లామీయ బోధనల ద్వారా ఈ శాసనాల న్యాయవంతమైన మిళిత కాలం పరిభాషలో అర్థం చేసుకునే విధంగానే ప్రదర్శిస్తారు. నిజం ఏమిటంటే న్యాయవంతమైన ఆలోచనలను కేవలం ఇస్లాం మాత్రమే ప్రసాదిస్తుంది.

## ఇతర మగ్గుదలలు

ప్రస్తుత కాలంలో కొన్ని మగ్గుదలలు తప్పనిసరిగా కల్లోలాన్ని, అలజడులను కలుగజేసేవిగా ఉన్నాయి. ఈ మగ్గుదలల ప్రచారం మానవులందరి వినాశానికి సందేశం ఇవ్వడం వంటిది. సుగుణాలు, మానవత్వం, కరుణా కటాక్షాలను వేర్లతో పెకలించి వేసి మానవ సంబంధాలను మార్కెట్‌లో శాసనాల ఆధారంగా బలిష్టపరచడానికి అవి కృషి చేస్తున్నాయి. దురదృష్టవశాత్తు ఈ మగ్గుదలల ప్రచారం వెనుక పాశ్చాత్య బలాలున్నాయి. జాతులు మిళితమై ఉన్నాయి. దేవుడు లేడు అనే భావనతో జీవిస్తున్నాయి,

పాపమయ నాగరికత ప్రబలి ఉంది. ఈ వరదకు టెక్నాలజీ అభివృద్ధి ప్రతి నిమిషం ఆహారాన్ని సమకూరుస్తుంది. వింత గొలిపే విషయం ఏమిటంటే, ఈ వరద వైపునకు ఆహ్వానించే వారిలో మహిళల కంటే పురుషులే అధికంగా ఉన్నారు!

వాటిలో కొన్ని ప్రధానమైన మగ్గుదలలను గురించి క్రింద పేర్కొనబడింది:

1) అన్నింటికంటే ముఖ్యమైనది ఏమిటంటే, మహిళలు పీడించబడటానికి దాంపత్య జీవనం, దాని నియమాలను అసలు కారణాలుగా చూపెట్టడం.

ఇది కుటుంబం అనే ప్రాచీన భావనను మార్చివేసి దాన్ని తల్లి దండ్రులు ఇద్దరిలో నుండి కేవలం తల్లినే ఇరుసుగా చేయాలనుకుంటుంది. అనగా కేవలం ఒక మహిళ, ఆమె సంతానం చుట్టూ ఆవరించి ఉన్న కుటుంబానికి చట్టపరమైన, సామాజిక న్యాయాన్ని ఇప్పించాలనుకుంటుంది.

స్వాతంత్ర్యం మహిళల అభీష్టంలోని ఒక భాగం అని పేర్కొంది. వారు పురుషుడి హింసకు కారణం, కుటుంబ వ్యవస్థను పేర్కొంటారు. అందువలన దీని నుండి స్త్రీని విముక్తి కలిగించడానికి దీన్ని అంతమొందించాలి. అప్పుడు కుటుంబమూ ఉండదు, పురుషాధిక్యతా ఉండదు, ఇంటి పని ఉండదు, ప్రజననం జరపాల్సినదిగా ఒత్తిడి కూడా ఉండదు. ఇవే వారి భావనలు. కాని నిజానికి లైంగిక కార్యాన్ని నిర్వర్తించడం వల్ల ఆమె ఏ ప్రత్యేక పురుషుడికీ లొంగి ఉండదు, ఆమెను సంతానాన్ని కనే యంత్రంగాగాను చేసివేయదు.

2) రెండవ మగ్గుదల ఏమిటంటే, స్త్రీ, సమాజం మధ్య హక్కులను పొందే యుద్ధాలను ప్రజ్వల్లింపజేయడం. స్త్రీ పురుషుల హక్కులను ప్రతీ రంగంలోనూ సమానంగా ఖరారు చేసి, లింగభేదం వలన సమాజంలో హక్కులను విభజించే పద్ధతిని పూర్తిగా అంతమొందించాలి. అదే విధంగా ఇవి న్యాయపరమైన ప్రయత్నాలను, హక్కులను కొల్లగొట్టడంగా మార్చివేసింది. ఈ మగ్గుదలకు అన్నింటికంటే ముందుగా విధులు, జీవన నిత్యకృత్యాల మధ్యవున్న భేదాలు గురయ్యాయి.

ఈ మగ్గుదలకు సంబంధించిన మరొక వివాదం ఏమిటంటే, మహిళలకు ప్రతీ మైదానంలోను వారు తమ ఇష్టానుసారం ఎంత సమయం కావాలంటే అంత సమయాన్ని అందులో వెచ్చించి సంపూర్ణంగా రాణించే స్వాతంత్ర్యం లభించాలి. దీని కొరకు రాజకీయ, ఆర్థిక, విద్య, సామాజిక వ్యవహారాల ఏర్పాట్లు మొదలగు అన్ని రంగాల మైదానాల తలుపులు వారి కొరకు తెరచి ఉంచాలి.

ఈ డిమాండ్ పర్యవసానంగా పురుషులు పిల్లల సంరక్షణ, ఇంటి పనులు, శిక్షణల బాధ్యతలు నిర్వర్తించాల్సి ఉంటుంది. ఒకవేళ టెక్నాలజీ ద్వారా సాధ్యపడితే పురుషులను ప్రత్యుత్పత్తి కార్యానికి కూడా బాధ్యత వహించాల్సిందిగా వీరు డిమాండ్ చేసేస్తారు.

3) మూడవ మగ్గుదల ఏమిటంటే, ఎవరైతే ప్రతీ వ్యక్తి విలువను అతని హోదా, అంతస్థులనుబట్టి కొలుస్తాడో, అతను ప్రతీ బంధుత్వ బాంధ వ్యానికి లాభంతో ముడిపెడతాడు. యు.ఎన్.డి.పి. అనే సంస్థ మహిళల ప్రాధాన్యతను కొలవడానికి జాతీయ ఆదాయంలో వారి పాత్రను కొలమానంగా ఖరారు చేసింది. వారి జాతీయ ఆదాయానికి సంబంధించిన అంచనాల ప్రకారం మహిళలు నిర్వర్తిస్తున్న అంతర్గత సేవలను లెక్కిస్తే

వారి భాగం 49% ఉంది. మహిళలకు ఇతర బహిరంగ సేవలలో కూడా అవకాశాలు అధికంగా కల్పించే మగ్గుదల ఇలాగే కొనసాగితే రాబోయే కొన్ని సంవత్సరాలలోనే వారి భాగం 51%, పురుషుల భాగం 49% మాత్రమే అయిపోతుంది. ఈ విధంగా జాతీయ ఆదాయంలో మహిళల భాగం పెంపొందింపజేస్తే వారికి అధికబలం చేకూరుతుంది.

ఈ మగ్గుదల సమస్త మానవ సంబంధ బాంధవ్యాలను మార్కెట్ సంబంధాల వలె మార్చివేస్తుంది. ఈ విధంగా ప్రతి మానవ సంబంధ బాంధవ్యం విలువ, ఆదరణ వారితో సమకూరే లాభంపైనే ఆధారపడి ఉంటుంది. ఇంటి పనులు అయినా, భర్త సేవ అయినా, పిల్లలకు పాలు పట్టడమైనా లేదా వారికి విద్యాజ్ఞానాలు, శిక్షణలు గరపడమైనా వీటన్నింటి ఆదరణ, విలువల స్థానాలను, అంతస్తులను మహిళలు ధనం ఆధారంగా నిర్ణయిస్తారు.

సౌశీల్యత, పవిత్రత, విశ్వాసం, సంస్కారం, త్యాగం, సేవల సంస్కారవంతమైన శాసనాలు స్త్రీ స్వాతంత్ర్యం, సంక్షేమంపై అక్రమమైన నిర్బంధాలు ఏర్పరచడమే మహిళలు పీడింపులకు, దౌర్జన్యాలకు గురవడానికి అసలైన కారణాలుగా వారు పేర్కొంటున్నారు. అందువలన వాటిని అంతమొందించాలని వారు భావిస్తున్నారు. యు.ఎన్.డి.పి. కాన్ఫరెన్స్‌లో ఈ విషయం ఎంతో అందమైన పరిభాషలో పేర్కొనబడింది. దీన్ని సమర్థించే తత్వం కూడా పూర్తి శక్తిసామర్థ్యాలతో ముందుంచబడింది. వారు ఈ సంస్కారవంతమైన శాసనాలలో దౌర్జన్యకరమైన నిర్బంధాలను అంతమొందించకుండా మానవులపై కంట్రోల్ సాధించడం అసాధ్యమైనదిగా పేర్కొంటున్నారు.

# చివరి మాట

పైన పేర్కొన్న మగ్గుదలలు అన్ని మతాలు, ధర్మాలు, సంస్కారాలను నిరాకరిస్తున్నాయి. ఈ మగ్గుదలలు, పాశ్చాత్యులలో నిమగ్నమై ఉన్నటువంటి రోగగ్రస్థమైన స్త్రీ ఆరాధన, సంస్కారహీనమైన నాగరికతల నుండి బయల్పడినవే. వీటిని ప్రచారం చేయడానికి ముఖ్యకారణం, ఈ నాగరికతను ప్రపంచంలోని ఇతర నాగరికతలన్నింటి పైనా ప్రత్యేకంగా ఇస్లామీయ నాగరికతా సాంప్రదాయాలపైన ఆధిక్యతను పెంపొందింపజేయడం కోసమే! సైన్స్, ఊహాజ్ఞానాలను ఆధారంగా చేసుకున్న ప్రమాణాల ద్వారా ఈ మగ్గుదలలను ముందుంచుతున్నారు. వాటిని వ్యతిరేకించడం ఇస్లామీయ ఉద్యమ విధితో పాటు మిల్లతె ఇస్లామీయ బాధ్యత, ఉలెమాల కర్తవ్యం కూడా. ఈ మగ్గుదలలకు వారు పేర్కొనే ప్రమాణాల డొల్లతనాన్ని వివరించి ప్రజలకు తెలుపడంతోపాటు, ఇస్లామీయ ఆచార సాంప్రదాయాల పరిరక్షణ, సాధారణ మానవ సమాజం కొరకు వాటిని అంతమొందించే విధానాలన్నింటినీ స్పష్టంగా ప్రకటించడం ఆవశ్యకమైనది.

